

1. దేవతా విగ్రహాలు, తదితర ప్రతిమలు 2 వన్నెవన్నెల నెమలి, కోడిపుంజులు



## ఆంధ్రుల జానపదశిలా సౌందర్యానికి
## మచ్చుతునకలైన కొన్ని కొండపల్లి బొమ్మలు

# ఇండోనీషియన్లు: వారి ఆచార వ్యవహారాలు

— డా. అల్ఫియన్ వై. హెల్మీ —

ఎవరీ ఇండోనీషియన్లు? ఏ దేశంవారు వీరు? ఆ దేశం ఎక్కడవున్నది? వీరి ఆచారవ్యవహారాలేమిటి? వీరి జీవిత క్రమమెట్టిది? ఆశయాలూ, అభిరుచులూ ఎలాంటివి?

—ఈమధ్య తరుచు వినిపిస్తూ, కంటబడుతూవున్న ఈ జనాంగాన్ని గురించి చాలామందికి ఈ ప్రశ్నలు ఉదయించడం సహజం. నిజంగా ఎంతోమందికి వీరిని గురించి అట్టే విషయాలు తెలియవన్నా తప్పులేదు. కాబట్టి నా యెరిగినవి మనవిచేస్తున్నాను.

ఇండోనీషియా అన్నది నైఋతి పసిఫిక్కులోని ఒకానొక ద్వీపసముదాయానికి పేరు. ఆ ద్వీపసముదాయం ఆక్రమించుకొనివున్న భూభాగం, జలభాగాలను చేర్చి చూస్తే అమెరికా సంయుక్త రాష్ట్రాలంత వైశాల్యం కలిగివుంటుంది. భూభాగమే ౭,౩౫౦,౦౦ చదరపు మైళ్లుంటుంది. అది భూమధ్యరేఖ మీద పడమరనుండి తూర్పుకు సుమారు ౪౬ డిగ్రీల అక్షాంశ మేరనూ, ఉత్తర దక్షిణాలుగా ౬ నుండి ౧౧ డిగ్రీల రేఖాంశ మేరనూ విస్తరించివుంటుంది. ౧౯౪౧ యుద్ధానికి పూర్వం అది డచ్చివారి ఏలుబడిలో వుండేది.

ఇండోనీషియా అన్న ఈ పేరు భారతదేశమని అర్థమిచ్చే 'ఇండోస్', ద్వీపమని అర్థమిచ్చే 'నేసిస్' అనే రెండు గ్రీకుపదాలనుంచి వచ్చింది. కాగా, దీని 'భారతీయద్వీపాలు' అన్నది ప్రతిపదార్థమని చెప్పినట్లయింది. ఈ సముదాయంలో సుమాత్రా, జావా, బోర్నియో (బ్రిటిష్ ప్రాంతాలు మినహాయించి), సెలిబీస్ అనే పెద్దద్వీపాలున్నూ, బాలీ, లంబోక్, సుంబావా, ఫ్లోరిస్ మొదలైన చిన్నద్వీపాలున్నూ, ఒక్కమాటలో చెప్పవలసివస్తే, మొలూకాలూ, న్యూగినీ పడమటిభాగాలతో సహితమైన "పెద్ద చిన్న సుండాద్వీపాలు" చేరివున్నాయి.

ఈ దేశంలో వారందరూ ఒకే కులగోత్రాలకు— ఇండోనీషియన్ (మలే) వంశానికి— చెందినవారైనా,

ఆ సందర్భాలేవంటారా?—రమధాన్ ఉపవాస మాసాంతిరమున్నూ, యాత్రాకాలంలోనున్నూ. (ఇండోనీషియన్లలో చాలామంది ఇస్లాం మతావలంబకులు) ఈ సందర్భాల్లో, పరస్పరాభినందనలు చెప్పుకొన్నతర్వాత, ఇండోనీషియన్లు ఏమరకుండా ఈ విన్నపం చేస్తూవుంటారు: "ఇదివరలో నేను నీ విషయంలో ఏదైనా తప్పుచేసిగాని, ఎంచిగాని ఉన్నట్టయితే నన్ను క్షమిస్తావని గట్టిగా నమ్ముతున్నాను". మిత్రులైనాసరే అమిత్రులైనాసరే ఎవరినైనా కాని క్షమార్పణ కోరడం మరచిపోవుట అన్నది ఇండోనీషియన్లు ఊహించుకోనే విషయాల్లో ముఖ్యమయింది. ఈ సామరస్య సహైక్యతాభావ కలిమివల్లనే, క్రైస్తవులు, బ్రాహ్మణులు, బౌద్ధులు మొదలైన ఇతర మతాలవారెందరో ఉన్నప్పటికీ, ఇండోనీషియాలో మత సంఘర్షణలన్నవి పేరుకైనా తలచూపలేదు. క్రౌర్యమూ, మొండితనమూ, దురభ్యాసాలూ—అనే ఇవి ఇండోనీషియన్లపాలికి పరమ హేయాలు.

ఇంతేకాదు, ఇండోనీషియన్లు కళాపిపాసువులు కూడా. అది వారి సహజప్రవృత్తి. మామూలు పల్లెకారులుకూడా సంగీత, వాస్తుశిల్పాల్లో ఏది మంచి అభిరుచో ఏది కాదో ఇట్టే పోల్చుకొనగలుగుతారు. ౯-వ శతాబ్దినాటికే ఇండోనీషియాలో ఎన్నో సుందర దేవాలయాలు వెలసివున్నవి. ౮ నుంచి ౧౫వ శతాబ్దం వరకూగల కాలం జావా సుమత్రాలపాలికి మహోత్తమమైన కళాయుగం. బాలీలో ఇప్పటికిన్నీ ఆ ప్రాచీన సంప్రదాయాలు సజీవంగా నిలిచివున్నవి. అక్కడి వారికి వస్తువిన్యాసంలో, అలంకార సంవిధానంలో వివేచనతో కూడిన సౌందర్యజ్ఞానం పుట్టుకతోనే అబ్బివుంటుంది. వారు ఏది తీర్చిదిద్దినా అందులో శక్తిత్వమూ, కళాశీలతా గోచరిస్తూవుంటుంది.

వ్యాయామక్రీడల విషయంలోనూ వారిది అందెవేసిన చెయ్యి. ఆటలంటే వారిపాలికి గొప్పకళ. ఆ ఆటల్లో ఎంత ప్రమాదం నిక్షిప్తమైఉంటే వాటికంతకంత ఎక్కువవిలువ. ఈ ఆటల్లో ఎక్కువ వ్యాప్తి గాంచింది గుఱ్ఱాలమీద జింకలవేట. ముష్టియుద్ధంకూడా వారికి మరొక అభిమానక్రీడ. వీటికితోడు ఇప్పుడిప్పుడు పాశ్చాత్య సంసర్గంవల్ల ఫుట్ బాల్, టెన్నిస్, బాస్కెట్ బాల్ మొదలైన పరదేశి ఆటలుకూడా విస్తారంగా వ్యాప్తి పొందుతున్నవి.

ఇండోనీషియన్ ఇండ్లు సాధారణంగా కొయ్యతో (అందులోనూ విశేషించి వెదురుకొయ్యతో) నిర్మింపబడినవి. జావాలో వీటిని వెదుళ్లతో నిర్మించుకొంటూవుంటారు. ఇవి శాశ్వతంగా ఉండవన్నమాత్రమే కాక చాలా సౌకర్యంగానూ వుంటాయి. వీరి గ్రామాలు వీలయినంతమట్టుకు సర్వసామాన్యంగా ఏ నదులతీరానో, ఏ కాలువగట్టులందో నిర్మింపబడడం మామూలయిపోయింది. స్నానపానాలకూ, రవాణా రాకపోకలకూ అనుకూలంగా ఉంటుందనేదే ఇందలి ఉద్దేశ్యం.

ఇండోనీషియను దేశంలో ఆచార వ్యవహార స్మృతి ప్రతిపాదితమైన ఒక గొప్ప సంప్రదాయం ఇక్కడ పేర్కొనక తీరదు. ధనవంతులూ, బలవంతులూ అయినవారు బీదలూ, దుర్బలులూ అయినవారికి విధిగా సహాయపడుతూ వుండవలెను. గ్రామపెద్దలు వారి విషయమై చాలా ఎక్కువ శ్రద్ధ తీసుకొంటారు. బీదాబిక్కీవారిలో కలిగే తగవుతగాదాలను తీర్చడంలోనూ, వారికి కావలసిన సౌకర్యాలను వీలయినంతగా సమకూర్చడంలోనూ వారు మహాశ్రద్ధ వహిస్తారు.

సొంత ఆస్తులమీద అత్యాసక్తితో హక్కు చెలాయించడమనేది అక్కడలేదు. తూర్పుదీవుల్లోని చాలామంది జనంవలెనే, తమకు కలిగినదాన్ని తోడివారితోపాటు పరిసమానంగా పంచుకోవలెనన్న సమదృష్టి వారికి రూఢమైపోయింది. ఉదాహరణకు: ఒక పరిపాలంఖ్యాతుండు ఉన్నాడనుకోండి. పాసుకర్త్య ఖర్చు వెచ్చాలూ, శిస్తుశిస్తులూ భరించేవాడు తానొక్కడే అయినా పంటకటావుడి మట్టుకు సర్వసమానంగా అందరికీ హక్కుభుక్తాలిస్తాడు. అందరికీ భాగాలు పంచుతాడు.

వరిసాగుకు సన్నాహాలు ప్రారంభించేముందరనే గ్రామస్థులంతా కలిసి, ఒకచోట సమావేశమై, వారిలో వారికి ఆ వ్యవసాయ విషయంలో ఉన్న అభిప్రాయ భేదాలను తీర్చుకోవడం ఈ ద్వీపాల్లో చాలాచోట్ల

ఆచారంగా వున్నది. ఇందువల్ల—నైగులకూ, భూభామంగులకూ ఉన్న విభేదాలు తీరిపోయి, ఏ తగాదాలూ లేకుండా తమవారి కార్యక్రమం సవ్యంగా జరుగుటకు వీలవుతున్నది.

ఊళ్లో ఎవరింట ఏమి జరిగినా అది సంఘంవారి నందరినీ ఆకర్షించి తీరిందన్నమాటే. గ్రామాంతరాల్లోని నిష్కల్మషహృదయులైన ప్రజలు సంఘంలోని ప్రతీవాని కష్టసుఖాలనూ మనస్ఫూర్తిగా గమనిస్తూ ఉంటారు. ఎవరింటనైనా ఒకరియింట వివాహం జరిగిందనుకోండి: సంఘమంతా ఆ ఉత్సవంలో పాల్గొన్నదన్నమాటే. సంఘంలోని ప్రతివ్యక్తీ ఆ ఉత్సవానికి సంబంధించిన సమస్త సాంప్రదాయిక కార్యకలాపాల్లోనూ ఐదునిమిషంలో త్రికరణశుద్ధిగా తోడ్పడి తీరవలసిందే. వధువు ఇంకొక ఊరిదయినట్టయితే సంఘంలోని ప్రతిఅమ్మడీ 'మా ఊరి కోడలు, మా ఊరికోడలు' అంటూ వెళ్లి ఆ కొత్తవధువుతో పరిచయం చేసుకొంటుంది. ఇలా పరిచయం చేసుకొని ఆమెతో మాటా పలుకూ ఆడడానికని సాయంకాలం వేళల్లో కొన్నిగంటలు ప్రత్యేకిస్తూ వుంటారు.

ఇండోనీషియనులు ఇంత నాగరికత కలవారైనా మరి—అయినా వారిలో చాలామంది మూఢవిశ్వాసపరులున్నారు. దక్షిణ సుమత్రాలో శుక్రవారంపూట ప్రయాణం చేయడం నిషిద్ధం. అంత అవసరమైన పనిదయినా తటస్థిస్తే శాంతిహోమాదికం చేసుకొనిగాని వెళ్లడానికి వీలులేదు. అలాగే మరికొన్ని ప్రాంతాల్లో శుభారంభాలకు మంగళవారం అంత మంగళప్రదం కాదు. ఇలాగే ఇంకా ఎన్నో విచిత్రనమ్మకాలు వారిలో పాదుకొని ఉన్నాయి.

ఇండోనీషియనులు మనలాగే బియ్యపన్నం తినే జాతికి చెందుతారు. వారు రెండుపూటలూ బియ్యపన్నమే తింటారు. కూరలుచేసుకొంటారు. కూరలతోపాటు చేపలూ, మాంసమూకూడా వ్యంజనాల్లో ఉపయోగిస్తూవుంటారు. పోపుసామగ్రి విస్తారంగా పండే దేశంవారు కాబట్టిన్నీ, తగ్గురకపు జీవితప్రమాణానికి చెందినవారు కాబట్టిన్నీ వారు తమ కూరాపులుసులను కారంగా చేసుకోవడానికి మమతపడుతూవుంటారు. అయితే కాయగూరలను వండుకొనేటప్పుడుమాత్రం వారు మిరపకాయలుగాని, మిరియాలుగాని లేకుండా వండుకోవడంకూడా కద్దు. ఇటువంటి కారంలేని కూరలను వారు 'సాయూరు' అంటారు.



# ఆంధ్రుల జానపద శిల్పకళాప్రపంచం

## ౨. కొండపల్లి బొమ్మలు

*

— శ్రీ సుధాంశు కుమారరాయ్ —

మన దేశంలోని కళాకారులు భారతీయకళను వ్యక్తీకరించుటకు అవలంబిస్తూ వచ్చిన ప్రాతిపదిక పద్ధతులననుసరించి, అందులో నే నేమీ ప్రామాణికుడను కాకపోయినప్పటికీ, పనికట్టుకొని ఏదో నాకుతోచిన రీతిని నాకుతోచినది చెప్పబూనుకొన్నందుకు పాఠకులు నన్ను క్షమిస్తారని ఆశిస్తున్నాను. భారతీయ కళా ప్రపంచంలో నా ఓపికనంతమట్టుకు నే చేసిన పరిశోధనల సందర్భంలో నా అంతరాత్మకు తట్టిందేదో దాన్నే నేను వ్రాస్తున్నాను. జానపదకళాశిల్పాలను కరతలామలకంగా అర్థంచేసుకొని ఆకళింపుచేసుకొనుటకు నాకు తోడ్పడినంతకంటే పలురెట్లుగా అవి నా పాఠకులకు తోడ్పడతాయని నా ఆశ.

మానవజీవులు రెండుపద్ధతుల్లో రెండుభాగాలుగా ఆత్మవ్యక్తీకరణచేసుకుంటూ చరిస్తూవుంటాయి. (౧) అంతరంగంలోని "అభిప్రాయం" "ముఖసీమ"లో నే ద్యోతకమవుతూ వుంటుంది. ముఖకండరాల సహాయంతో వెలికివచ్చి ముఖసీమలో ఒక విచిత్రదృశ్యాన్ని సృష్టించేది "భావన" (అంతస్సులో నే ఆలోచించుట) అనే ఒకానొక ప్రవృత్తి. దాన్నే మనము "భావము" అనేపేర పిలుస్తాము. ఈ భావం మనస్సులోని ఆంతరిక సందేశాన్ని మనకు తెలియజెప్పేదిగావుంటుంది. దాన్ని శాంతము, కరుణము, బీభత్సము, హాస్యము మొదలైన తొమ్మిది రసాలుగా విభజించవచ్చు. చిరునవ్వుగాని, పెనునవ్వుగాని మానవశరీరంలోని మరి యే యితర అంగాలలోనూ వ్యక్తంకావడానికి వల్లపడుటలేదు. ఆ హక్కు ఒక్క ముఖసీమకే వున్నది. సాధారణంగా మనం ఇతరులు మాట్లాడగా వినేటప్పుడు ఆ మాట్లాడే వ్యక్తి ముఖంలోని కదలికల సహాయంతో వాని ఆ మాటలనూ, వాటి అసలు అంతరార్థాన్నీ ఉన్నదున్నట్టుగా అర్థంచేసుకోవలెననే ఉద్దేశ్యంతో మన కండ్లను నేరుగా ఆ వ్యక్తి ముఖంమీదకి కేంద్రీకరించి చూస్తూ వుంటాము. "మాటలు" అనేవి అసలు కళాకారుల దృష్టికిందికి రావేరావు. కాగా, లోపలిభావానికి సంపూర్ణంగా, స్పష్టంగా, నిర్ధారణగా నిర్దిష్టరూప మివ్వజాలిన భావమొక్కటే కళాకారులకు మిగిలిన సాధనోపాయం. (౨) ముఖం మినహాయించి మానవశరీరంలోని మిగిలిన అంగాలన్నీ శక్తియొక్క స్వరూపాన్ని మనకు వెల్లడిస్తూవుంటాయి. వస్తువులనూ, వస్తువులనూ గల వ్యాపారాల నిర్వహణకై ఉచిత శక్తిసంపత్తితో వాటిని ఎత్తడమూ, కదిలించడమూ జరుగుతూవుంటుంది. ఈ వ్యాపారాలకు శక్తి బదలాయింపులో, లేదా వలసతో ఆవశ్యకమైవుంటుంది. అదే భంగి, లేక భంగిమ.

భారత దేశంలో నాగరిక కవితాకారులవలెనే నాగరిక కళాకారులుకూడ ముఖ్యంగా నవరసకళ-భావకళనే భావిస్తూవచ్చినారు. కాని జానపదకళాకారులు మాత్రం జానపదప్రజలవలెనే తాము పుట్టి పెరిగిన ఆ ఒక్క సర్వసాధారణ భంగిమలనే అవగాహనచేసుకుని, శక్తియొక్క కలపలతో నిండిన "భంగి" విన్యాసం, శక్తి విన్యాసం మాత్రమే వెల్లడింపజాలిన పనినే ముఖ్యంగా నిర్వహిస్తూవచ్చినారు. మనదేశీయమైన నాగరికకళకు నిదర్శనమైనట్టి నటరాజ శివునియొక్క, ధ్యానిబుద్ధునియొక్క విగ్రహాలను ఉదాహరణకు తీసుకొని చూద్దాము. అలా చూచినప్పుడు వాటిలోని భంగి భావానుగుణంగా రూపొందివున్నట్టు మనము చూడ

ఎక్కడెక్కడనుంచో ప్రాచీన జానపద కళాఖండాలను కష్టపడి సేకరించుకొనివచ్చి, నలుగురికీ తన కృషి చూపవలెననీ, నలుగురికీ ఈ ప్రాచీనకళలో అభిరుచి కల్పించవలెననీ కలకత్తా నగరంలో ౧౯౩౨ సంవత్సరం మార్చిలో ఒక పెద్ద జానపద కళాప్రదర్శనంకూడా ఏర్పాటుచేసి, జయప్రదంగా నిర్వహించినాడు. ఇటువంటి ప్రదర్శనం భారతదేశంలో జరగడానికి ఇదే ప్రథమం. అదే సందర్భంలో ఈ కళలోని విశిష్టతనూ, విలువనూ దర్శకలోకానికి వెల్లడించుటకు అనేక యత్నాలు చేయబడినవి. అటుతర్వాత ౧౯౩౨ ఏప్రిల్‌లోనూ, ౧౯౩౩ సెప్టెంబరులోనూ దత్తుగారు కలకత్తా విశ్వకళాపరిషత్తులో జానపద కళలమీదా, జాతీయ సంస్కృతికి వాటికిగల సంబంధంమీదా చక్కని ఉపన్యాసాలిచ్చినారు. ఆ తర్వాత వ్రతాచారి ఉద్యమం (దీని స్థాపకుడు తానే) ద్వారా బెంగాలులోని అనేకమంది యువతీ యువకులను చేరదీసి వారికి ఈ జానపద కళాసంప్రదాయాలతో పరిచయం కల్పించి వారినికూడా ఈ ఉద్యమంలోకి లాగుకొనినాడు.

అటువంటి సేవాశీలిని దురదృష్టవశాత్తూ బెంగాలు రాష్ట్రం ౧౯౪౧ జూనులో కోలుపోవలసివచ్చింది. కాని, ఆయన ఉపక్రమించిన ఉద్యమం మాత్రం అమోఘంగా సాగుతూనే ఉన్నది.

ఈ మహనీయునిలాగానే అదే ఆదర్శంతో ఆంధ్రదేశంలోని కళాకారులూ, కళాభిమానులూ ముందుకువచ్చి, తమ దేశంలో కొనఊపిరితో నామమాత్రంగా నిలిచివున్న జానపద కళాశిల్పాలను అవి నామరూపరహితంగా మాసిపోకముందే జీర్ణోద్ధారంచేసి, జాతీయ వికాసంతో వాటి విలువను ఒక్క ఆంధ్రలోకానికేకాక యావద్భారతానికీ చాటే ప్రయత్నాలు ఎందుకుచేయరా అనీ, ఇకనైనా తప్పక చేస్తారనీ, తమజాతి ప్రాచీనప్రతిష్ఠను శాశ్వత బ్రహ్మకల్పంగా నిలుపగలరనీ నేను మరీమరీ ఆశిస్తున్నాను.



# కాలగమనంపై

## కలలో 'పాకిస్థాన్'

ఆ రాత్రి నేను నా పక్కదగ్గరకు వెళ్లి కూర్చునే సరికి గడియారము టంగు టంగుమని ౧౧ గంటలు కొట్టింది. ఆవులింతలు అల్లకల్లోలము చేయుట మొదలు పెట్టినవి. పగలంతా ఎక్కువ శ్రమపడుటవల్ల గాబోలు వెంటనే నిద్ర కన్నులమీద కలియబడుతూవుంది. అంతే.

భారత దేశాన్ని హిందూస్థాన్, పాకిస్థాన్ అనే రెండు భాగాలుగా విభజించారట. పంజాబు, బెంగాల్ మొదలగు రాష్ట్రాలలో రెండేసి మంత్రివర్గాలు స్థాపించారట. కేంద్రంలో రెండు మంత్రివర్గాలు ఏర్పడ్డాయి. జిన్నాగారు తన పంతుపట్టు నెరవేరిందనే సంకుచితమైనదృష్టితో వార్తాపత్రికలనిండా ప్రకటనలు చేశారు. తన ప్రయత్నం నెరవేరింది. ఇక తన ప్రజలు హాయిగా, సుఖంగా, స్వేచ్ఛావిహారులుగా, స్వతంత్ర వాయువులు పీలుస్తూ నిరాటంకంగా, నిరపాయంగా, నిర్విఘ్నంగా జీవిస్తారనే సంతోషాతిశయాలతో జిన్నాగారు తమ పాకిస్థాన్ రాష్ట్రాలలో వేదికలపై ఉపన్యాసాలు దంచుతున్నారు. ప్రజలు అఖండంగా సంతోషాతిశయాలతో పూలమాలలతో ఆయనను ముంచెత్తుతున్నారు. పాకిస్థానును గూర్చిన పట్టుదల, త్యాగం కొనియాడుతూ మౌలానా లంతా "జిన్నా సాహెబ్ జిందాబాద్" అంటూ కవిత్వాలు కదం త్రొక్కిస్తున్నారు. జిన్నా సాహెబుగారు వంగి వంగి సదుమును పాగడీసుకొంటూ 'ఈ స్వరాజ్యసృష్టికి నేనేగదా బ్రహ్మ' అని లోలోన వుటికి వూగిపోతున్నాడట.

నాలుగుమాసాలు గడచినవట. ఇంకేముంది? పాకిస్థాన్లో కలకలం బయలుదేరింది. అమాయికపేద ప్రజల "అన్నమో అల్లా" అను శోకధ్వనులు మిన్ను ముట్టాయి. కారణాలు పత్రికల్లో శరపరంపరగా గుప్పించి చేస్తున్నారు.

ధాన్యం హిందూస్థాన్లో అధికోత్పత్తి. నూనెగింజలు పాకిస్థానంలో లోటు. పంచదారకు హిందూస్థానిది పైచెయ్యి. ప్రత్తి హిందూస్థాన్లో ఎక్కువ. జనుము పాకిస్థాన్లో కొంచెము ఎక్కువ. ముడిఇనుము, మాంగనీసు హిందుస్థానంలో హెచ్చు. హిందువు లధికసంఖ్యాకంగా వున్న భాగంలోని ఆదాయం అర కోట్లరూపాయలు మినహాయిస్తే ౩౬ కోట్లుమాత్రం. హిందూస్థానపు ఆదాయం అర కోట్లు. పాకిస్థాన్లో నుంచి హిందూఖండపు ఆదాయం అర కోట్లు. జమ్లా ౧౭.౪ కోట్లు. పాకిస్థానపు ఆదాయం కృశించటమే కాకుండా ఎదుగు, బొదుగులేని ఆదాయం. భూమిశిస్తు లాంటిది. శాయిరీసుంకం ఆదాయపుపన్ను లాంటిది. వృద్ధికావలసిన వుత్పత్తి ఎక్కువగా లేదు. మహమ్మదీయులు అధికసంఖ్యగా ఉన్న పంజాబ్, కాశ్మీరం, బెలూచిస్థానం, సింధు, తూర్పుబెంగాలులలో ఖనిజ సంపద లేనే లేదు. వ్యవసాయాదాయం అభివృద్ధిచెందా లంటే హిందూస్థానంలో తయారైన వస్తువు లెన్నో దిగుమతి కావాలి. దేశప్రజలమీద మరియొక దేశప్రజలు, రాష్ట్రప్రజలమీద మరియొక రాష్ట్రప్రజలు ఆధారపడవలసిఉండుట తప్పదు. అందుచేత పాకిస్థాన్ప్రజలు ఆర్థికంగా, నైతికంగా, పారిశ్రామికంగా, ఆహారరీత్యా చాలా వెనుకబడి మలమల మాడుతున్నారు.

హిందూస్థాన్నుండి ఏ విధమైన సహాయమూ, సహకారమూ జిన్నాగారు కోరలేదట. పైపెచ్చు హిందువులు ఆరాధించే భానుని రెండుభాగాలుగా చేయమన్నాడట. లేకపోతే పాకిస్థాన్లో సూర్యుడు తిరగకుండా ఆకాశమునకు అడ్డంగా గోడకట్టేవిధం

శైవవారి చరిత్రలకలన మానవశ్యశ్రీ ప్రజ్ఞాపారమితం కావటకుండుం. మా పిన్ని కామాక్షమ్మగారు ఈ రెండవ శ్రేణికి చెందిన ధన్యజీవి. చిన్నతనంలో ఆమె అందరివలె సామాన్య బాలవితంతువు.

ఆమె ధనసంపన్నమై ఉన్నతస్థితికి చెందిన వాళ్లంవారి కుటుంబంలో ఏలోటూ లేని పరిస్థితులలో పెరిగింది. వివత్పటికి జ్ఞానమెరిగిన తర్వాత, తన అనాథ స్థితి నష్టం చేసుకొన్న తర్వాత, ఆమె ప్రతిక్షణమూ తన జీవిత సార్థక్యంకోసం తన పరిసరాలతో మానసికంగా ప్రబలమైన పోరాటం సల్పింది. "ఆ దేవుడా! నా జీవితం ఇలా నాలుగు గోడలమధ్యనా వ్యర్థం కావలసిందేనా! ఏ భాగ్యాన్ని సేవ దేశానికిగాని, అనవసరం ఒక సంఘానికైనా సేవ సేంచేయలేనా" అని ఆరాటపడేది. కొన్నాళ్ళ కెల్లాగైతేనేం ఈ తీవ్ర సంఘర్షణలోనుండి ఆమె నిశ్చితాభిప్రాయం సంఘసేవ అనేది తప్తకాంచనంలాగా నిలబడి నిర్మలరూపం దాల్చింది.

ఆ పరిస్థితిలో శ్రీ వాకం రామలింగయ్యగారు ఆమె అభిప్రాయాలకు దోహదమిచ్చి వైశ్య సేవా సదనం స్థాపిస్తానని అభయమిచ్చారు. అది మొదలు ఆమె సదనసంస్థాపన జరిగేవరకూ 'నిద్రపోలేదు. నీరు త్రాగలేదు.' ఏకో సంకల్పంతో ఆమె మద్రాసునుండి పడి పడివచ్చి, ఎన్ని తీవ్రప్రతిబంధకాలున్నా లెక్క చేయక అనుకొన్న మహిళారామ సదనము స్థాపించి తన ఉత్సాహం, పట్టుదల నెరవేర్చుకొన్నది.

ఐతే ఈ విషయంలో కామాక్షమ్మగారిని గురించి విశిష్టంగా చెప్పదగినది ఒకటివున్నది. ఆంధ్ర దేశములో సాధారణంగా వున్న బాలవితంతువులు అత్తిళ్లల్లో, పుట్టిళ్లల్లో సవ్యచాకిరీచేస్తూ ఆదేపరమార్థమని నమ్మి అన్నగార్లు, వదినగార్లు, అత్తగార్లు, మామగారు నానాబాధలు పెడ్తూ ఉన్నా నోరు కదపలేనిస్థితిలో వుంటారు. స్వతంత్రత వుండదు. ఒకవేళ వారికి ఏమైనా కొన్ని భావాలంటూ కలిగాయో, అవి అజ్ఞానతమసచ్ఛాయలలో ఈనతూనే వుంటాయి. అప్పట్లో ఏదో గురువులవద్దకు వెళ్లాలని, వాళ్ల పాదసేవలు చేస్తూ అని, మతం అని, పురాణాలు అని, హరికథలనీ, అక్కడకు వెళ్ళాలని ముచ్చటపడేవారే కాని, విద్యార్జనం వారికి లభ్యంకూడా వుండేదికాదు. అల్లాంటి ఆలోచనల దాకైనా పోయేవాళ్ళు కారు. ఒకవేళ ఎవరయినా సాహసించినా కుటుంబపెద్దలు వాళ్ళగొంతుక పిసికి పారేసేవారు.

ఐతే, శ్రీమతి కామాక్షమ్మగారి పరిస్థితి మాత్రము అలాంటిది కాదు. అప్పట్లో నే వాకంవారి కుటుంబము చాలా ధనసంపన్నమైనదే కాక చాలా విజ్ఞానవంతమైనదికూడా. కామాక్షమ్మగారు మద్రాసులో తన మేనమామగారయిన శ్రీ వాకం లక్ష్మీకాంతంగారి యింట్లో పెరిగారు. పైన వ్రాసిన బాధలు ఆమెకు లేవు. ఆమె అప్పుడప్పుడు రాజమండ్రి వచ్చి వుంటూకూడా ఉండేది. అప్పుడే శ్రీ మా నాయనగారు వాకం కృష్ణారావుగారు గౌతమీ గ్రంథాలయము కొత్తగా తెరచి, స్త్రీలకోసం ఇంటింటికి పుస్తకాలు పంపించి స్త్రీలలో విద్యావిజ్ఞానాలు ప్రచారం చేసేవారు. మా పిన్నికూడా ఈ ప్రచారానికి ఆకర్షితురాలయి పుస్తకాలమీద పుస్తకాలు తెప్పించి గౌతమీ గ్రంథాలయంలోని పుస్తకాలన్నీ తిరగవేసింది. ఆలోచనలలో నే ఆమె వీరేశలింగంగారి చరిత్ర చదవడం, సేవాబీజాలు మనస్సులో నాటుకోవడం జరిగాయి. ఇంతకీ చెప్పవచ్చేదేమంటే, సామాన్య సంసారాలలోవలె కామాక్షమ్మగారికి చిన్నతనంలో అందరు బాలవితంతువులకు వలె కష్టాలులేకపోయినా ఆమెలో సేవాశక్తి, స్వాతంత్ర్య ప్రగతిభావ రేఖలున్నాయే కాని, మామూలు కథా కాలక్షేపాలకు ఆమె మనస్సులో మొదటనుండి తావు యేర్పడలేదు. ఆమెలోని ఈ విశిష్టగుణమే, ఆంధ్రదేశంలో ప్రప్రథమ స్త్రీవిద్యా జాతీయసంస్థకు కారణభూతమయింది.

సదన సంస్థాపన జరిగింది. జరిగినతరువాత తన పని అయిపోయిందని ఆమె ఊరుకున్నారా? లేదు. అప్పుడు మళ్ళీ చదువు మొదలుపెట్టి ఉభయభాషా ప్రవీణ పరీక్షలో ఉత్తీర్ణత పొందింది. అంతలో అప్పుడు మళ్లీ మొదలుపెట్టి కుట్టుపని నేర్చుకొన్నది. అప్పుడు మళ్లీ మొదలుపెట్టి హిందీచదివింది. ఇంగ్లీషు



# విమర్శనము



౧. కవిప్రియ

౨. దీక్షితగర్హిత

3. పద్మావతీచరణచారణ చక్రవర్తి

౪. రత్నాకరము

మొదటి మూడూ పద్యనాటికలు; రత్నాకరము గీతికాసంవాదము. శ్రీ శివశంకరశాస్త్రిగారి రచనలు సాహితీసమితి ప్రచురణలు.

శ్రీ శివశంకరశాస్త్రిగారు అంటే ఇప్పటి తెలుగు చదువరులకు 'ఫలానా' అని పరిచయం చెయ్యక్కర లేదు.

శాస్త్రిగారి పేరు ఉచ్చరించగానే సాహితీసమితి, హృదయేశ్వరి, అన్ని విషయాలమీద ఆచార్యులలా మాట్లాడే ఆయన నేర్పు, బోలెడు కథలూ వరసగా జ్ఞాపకం వస్తాయి. నవ్యసాహిత్య ప్రసక్తిలో ఆయన్ని విడిచి మాట్లాడడం దుర్లభం.

వక్తగా, కవిగా, పండితులుగా ప్రసిద్ధులు. ఈయన ఖండకావ్యాలు, కథలు కన్న ఎక్కువ పద్య నాటికలు చాలా వ్రాశారు. లోకానికి ఈయన ఖండకావ్యాలమీదా, కథలమీదా మోజు అయితే — ఈయనకు తన పద్య నాటికలమీద ఎల్లలు మీరిన అభిమానం.

ఇదొక చిత్రమైన సన్నివేశం!

వేదములలోనూ, ఉపనిషత్తులలోనూ ఉన్న ఛందోబద్ధమైన వాక్యాలు (సంభాషణలు) తప్పిస్తే లౌకిక సంస్కృతసాహిత్యంలో నాటకమంతా పద్యాలతో నడిచే రచనలు కనబడవు.

సుప్రసిద్ధసంస్కృత నాటకరచయితలు భాస, కాళిదాస, భవభూతి, హర్షదేవాదుల నాటకాల్లో పద్యా లుంటాయి. అయితే అవి చమత్కారమూ, భావావేశమూ, రసపుష్టీ కలగవలసిన చోటమాత్రమే ఉండి తక్కిన సాధారణసంభాషణం అంతా సహజమైన వచనంలో సాగుతుంది.

ఇప్పటి సారస్వతసమాలోచనాపరులలో ఒక వైపు తీవ్రంగా ఉన్న వాదం ఏమంటే — నాటకంలో అసలు పద్యాలే పనికిరావు. నాటకగమనాన్నీ, సహజత్వాన్నీ ఈ పద్యాలు చంపుతున్నాయి. పద్యం రాగానే సంగీతం వస్తుంది. దానితో నాటకంలో ఉద్దేశించిన సన్నివేశసౌందర్యం, రసానుభూతీ, సంగీతం చాటున మాటుపడి, నాటకప్రయోజనం ధ్వంసమై పోతున్నది. కనుక వచననాటకాలు తప్ప ఇంకొకరకం ఈ కాలానికి పనికిరావు అని గర్జిస్తున్నారు.

రెండో వైపువారు కొందరు నాటకమంతా పద్యాలతోటే నిర్వహణంగా ఎందుకు వ్రాయకూడదు, సాహిత్యప్రక్రియలో ఇదొక కొత్తరీతి ఎందుకు కారాదు అని పట్టుబట్టి నాటకాలు పద్యాల్లోనే వ్రాస్తున్నారు.

రెండవ శ్రేణికి ప్రతినిధి శివశంకరశాస్త్రిగారు.

ఈయన సుమారు ౧౦ నాటికలు పద్యాల్లోనే వ్రాశారు. ఈయన్ను అనుసరించిన ఒకరిద్దరు రచయితలుకూడా ఉన్నారు. కాని, ఈ పద్యనాటికలకు రావలసినంత ప్రఖ్యాతి రావడంలేదు.

కారణం — నే నిట్లా అనుకుంటాను.

సారస్వతశాఖల్లో అన్నిటికంటె నాటకం ఎక్కువ జీవితసమీపవర్తి. కనుక దానిలో జీవితప్రతిఫలనరూపమైన సహజత్వాన్ని ప్రజలు మిక్కిలి పట్టింపుగా చూస్తారు. కవులు కూడా ఈ దృష్టితోనే శ్రవ్యకావ్యాల్లో ఉపయోగించని ప్రాకృతం పాత్రలు బట్టి నాటకాలలో వచ్చింది. సామాన్యసంభాషణకు పద్యాలు వాడకుండా చాలకాలం జాగ్రత్తపడి, భావావేశమును బట్టి పద్యము లుంచారు. ఒకవేళ అనావశ్యకములైన పద్యాలుంటే—నటులు వాటిని తీసివేసి ఇతివృత్తానికి చేరువగా తేవడానికి ప్రయత్నించడం కద్దు.



# విమర్శనము



౧. కవిప్రియ

౨. దీక్షితదుహిత

3. పద్మావతీచరణచారణ చక్రవర్తి

౪. రత్నాకరము

మొదటి మూడూ పద్యనాటికలు; రత్నాకరము గీతికాసంవాదము. శ్రీ శివశంకరశాస్త్రిగారి రచనలు సాహితీసమితి ప్రచురణలు.

శ్రీ శివశంకరశాస్త్రిగారు అంటే ఇప్పటి తెలుగు చదువరులకు 'ఫలానా' అని పరిచయం చెయ్యనక్కరలేదు.

శాస్త్రిగారి పేరు ఉచ్చరించగానే సాహితీ సమితి, హృదయేశ్వరి, అన్నివిషయాలమీద ఆచార్యులులా మాట్లాడే ఆయన నేర్పు, బోలెడు కథలూ వరసగా జ్ఞాపకం వస్తాయి. నవ్యసాహిత్య ప్రసక్తిలో ఆయన్ని విడిచి మాట్లాడడం దుర్లభం.

వక్తగా, కవిగా, పండితులుగా ప్రసిద్ధులు. ఈయన ఖండకావ్యాలు, కథలు కన్న ఇటీవల పద్య నాటికలు చాలా వ్రాశారు. లోకానికి ఈయన ఖండ కావ్యాలమీదా, కథలమీదా మోజు అయితే— ఈయనకు తన పద్యనాటికలమీద [illegible] అభిమానం.

ఇదొక విచిత్రమైన సన్నివేశం!

వేదములలోనూ, ఉపనిషత్తులలోనూ ఉన్న ఛందోబద్ధమైన వాక్యములు (సంభాషణలు) తప్పిస్తే లౌకిక సంస్కృతసాహిత్యంలో నాటకమంతా పద్యాలతో నడిచే రచనలు కనబడవు.

సుప్రసిద్ధసంస్కృత నాటకరచయితలు భాస, కాళిదాస, భవభూతి, హర్షదేవాదుల నాటకాల్లో పద్యాలుంటాయి. అయితే అవి చమత్కారమూ, భావావేశమూ, రసస్ఫూర్తీ కలగవలసిన చోటమాత్రమే ఉండి తక్కిన సాధారణసంభాషణం అంతా సహజమైన వచనంలో సాగుతుంది.

ఇప్పటి సారస్వతసమాలోచనాపరులలో ఒక వైపు తీవ్రంగా ఉన్న వాదం ఏమంటే—నాటకంలో అసలు పద్యాలే పనికిరావు. నాటకగమనాన్నీ, సహజత్వాన్నీ ఈ పద్యాలు చంపుతున్నాయి. పద్యం రాగానే సంగీతం వస్తుంది. దానితో నాటకంలో ఉద్దేశించిన సన్నివేశసౌందర్యం, రసమాధురీ, సంగీతం చాటున మాటుపడి, నాటకప్రయోజనం ధ్వంసమై పోతున్నది. కనుక వచననాటకాలుతప్ప ఇంకోరకం ఈ కాలానికి పనికిరావు అని గర్జిస్తున్నారు.

రెండోవైపువారు కొందరు నాటకమంతా పద్యాలతోనే నిర్వహించగా ఎందుకు వ్రాయకూడదు, సారస్వతప్రక్రియలో ఇదొక క్రొత్తరకం ఎందుకు కారాదు అని పట్టుబట్టి నాటకాలు పద్యాల్లోనే వ్రాస్తున్నారు.

రెండవ శ్రేణికి ప్రతినిధి శివశంకరశాస్త్రిగారు.

ఈయన ఇంతవరకు ౧౦ నాటికలు పద్యాల్లోనే వ్రాశారు. ఈయన్ను అనుసరించిన ఒకరిద్దరు రచయితలుకూడా ఉన్నారు. కాని, ఈ పద్యనాటికలకు రావలసినంత ప్రఖ్యాతి రావటం లేదు.

కారణం — నే నిట్లా అనుకుంటాను.

పాశ్చాత్యదేశాల్లో అన్నిటికంటె నాటకం ఎక్కువ జీవితసమీపవర్తి. కనుక దానిలో జీవితప్రతిఫలనరూపమైన సహజత్వాన్ని ప్రజలు మిక్కిలి ఇష్టంగా చూస్తారు. మనం కూడా ఈ దృష్టితోనే శ్రవ్య కావ్యాల్లో ఉపయోగించని ప్రాకృతం పాత్రలనుబట్టి వాడవలసి వచ్చింది. సామాన్యసంభాషణకు పద్యాలు వాడకుండా చాలనాళ్ళు జాగ్రత్తపడి, భావావేశమును బట్టి పద్యము లుంచారు. ఒకవేళ అసాధారణమైన పద్యాలుంటే—వటువు వాటిని తీసివేసి ఆ కవితానికి చేరువగా లేనిదానికి ప్రయత్నించడం కద్దు.

'పద్మావతీ చరణచారణ చక్రవర్తి' గీతగోవింద కర్త జయదేవకవీంద్రుని పద్మావతీకథ.

గౌడలక్ష్మణసేన భూకాంతుడు జయదేవకవిని సగౌరవంగా సభకు రావించి విద్వాంసుల సముఖాన గీతగోవిందమును విని ఆనందించి సన్మానించి గజారోహణోత్సవం జరపడం, కవిభార్య పద్మావతి భర్త ప్రతిభకు, ప్రేమకు ముదితురాలై అంతఃపురపద్మావాలంకారాలతో అలంకరించుకొని నాట్యం చెయ్యడం ఇందలి ప్రధాన ఇతివృత్తం.

సంభాషణలూ, పాత్రపోషణా సాఫీగా నడిచాయి. కవి ప్రేమార్ద్రహృదయం, స్త్రీ గౌరవం బాగా చిత్రితములైనాయి. ఇదికూడా సంస్కృతకవిచరిత్ర ఐనా, ఇందులోని సంభాషణలకు గీర్వాణవాసన తగలలేదు. అయితే మురారికవి 'కష్టా వేసవ్యథా' అనే శ్లోకాన్ని శాస్త్రిగారు అక్షరాలా తెలిగించి అసంగతి సృష్టించకపోవడం మరపుచేతనే అనుకుంటాను.

ఇక—ఇందులో పైనాటికల్లో ఉన్నంతమాత్రమైనా నాటకీయసన్నివేశవిశేషం లేదు. కనుక నాటికాదృష్టితో మాత్రే ఇది పద్యసంభాషణ పరంపరగా కనిపిస్తుందిగాని ఘటనాచాతుర్యసుందర నాటకం అనిపించదు.

'రత్నాకరము' లో పాత్రలు పలుచనే ఉన్నందువల్లనూ, కదలిక తక్కువగా ఉన్నందువల్లనూ శాస్త్రిగారు దీనిని గీతికాసంవాద మనిఉంటారు.

భ్రమరిక అనే ఒక యువతి వివాహిత అయినా అత్తవారిల్లంటే అయిష్టపడి ఒకసారి తన బంధువులింట ఆకస్మికంగా చూచిన త్రిలోచను డనే ఒక యువకుణ్ణి ప్రేమిస్తుంది. తన ప్రేమకథ శాంత అనే చెలిమికత్తెతో ఈమె చెప్పినే ఉత్తరభాగంలో త్రిలోచనుడు ధూర్జటి అనే తన మిత్రునితో చెబుతాడు.

సంభాషణ సాఫీగా, శృంగారకథాసహజమైన ఈమన్మాధుర్యంతో చల్లగా సాగుతుంది. అంతకన్న దీనినిగురించి చెప్పవలసిన విశేషం లేదు.

తుదిమాట : శ్రీ శివశంకరశాస్త్రిగారు రెండు మూడు మంచి వచననాటికలు వ్రాశారు. 'కడి

సంహారం' 'స్త్రీ విరోధి' చదువదగ్గవి. ప్రదర్శనానికి గూడా 'ఫసందు'గా ఉంటాయి. ఆయన హృదయేశ్వరి, కొన్ని చిన్నకథలు తెలుగు పాఠకులు ఆదరంగా చదవకపోలేదు.

నిజం చెప్పవలసివస్తే శాస్త్రిగారి ఈ పద్యనాటికలు ఇప్పటితరానికి ఎదురీత అనకతప్పదు.

ఈ నాటికారచనలో గూడా శాస్త్రిగారికి మురారిధోరణి పట్టుబడిందిగాని భాసకాళిదాసమార్గం కాదు.

భాషలో, భావచిత్రణంలో శాస్త్రిగారి సంస్కృతపక్షపాతం ఈ నాటికల్లోంచి ఎంతయినా ఉదాహరించవచ్చు.

భాషలో, కల్పనలో జీవితాని కెంత దగ్గరగా ఒస్తే నాటకశిల్పంలో అంత విజయం.

భావశిల్పంలో, పదప్రౌఢిమలో ఎంత ఉన్నత శిఖర మెక్కితే కావ్యానికంత మెరుగు-కదా—

శాస్త్రిగారు లోకాన్ని చూచి తమ మార్గమేదో సరియైనదిగా నిర్ణయించుకోగలిగిన ప్రజ్ఞావంతులనే నా నమ్మకం.

'ఆనందవర్ధన'

## చిత్రాంగద

నవరచనావళి (c/o జేకర్ పామిలీథి, మైలాపూరు, మద్రాసు) వారి తృతీయ ప్రచురణ. వెల రూ. ౧-౮-౦.

ఈ గ్రంథమాలిక వారు ఇంతకుముందు రెండు మంచి కథానికా సంపుటాలు ప్రచురించారు.

ఇప్పుడు నాటిక—

ఈ నాటికకు ఆకవి శ్రీ రవీంద్రనాథ ఠాకూరు.

ఆయన వంగమాతృకకు శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారి అనువాదం ఇది.

భారతంలోని చిత్రాంగద కథకు రమణీయమైన కావ్యరూప మిచ్చి, రవీంద్రకవి, ఈ నాటికను రచించినట్లు కనబడుతుంది.

దీనికి కవి నాటిక అని పేరుపెట్టినా దీనిలోని గంభీరమూ, సుందరమూ అయిన కవితా ధోరణి దీన్ని లోకానికి కావ్యంగానే చూపిస్తుంది.

ముందు పురుషభావపూరిత అయిన చిత్రాంగదలో, మన్మథవసంత సహాయంవల్ల క్రమంగా వికసించిన స్త్రీత్వ, లావణ్యసిరులు ఆమె హృదయంలో కాఠిన్యాన్ని తొలచి ప్రేమమాధుర్యాన్ని నింపడం, అర్జునుని ప్రేమించి, ఎదుటికి వచ్చిన అతన్ని గుర్తించక మాటలాడడం ఇందులోని ఘటనాచాతుర్యాలకు ఉదాహరణాలు.

సుపరిచితమైన రవికవి కవితా మాధుర్యాలను గురించి ఇప్పుడు ప్రసంగం ఎత్తుకోవడం అనవసరమైన అవసరం. అనువాదంగురించి ఒక మాట.

మనకు సరిగ్గా ఇంగ్లీషు 'బ్లాంక్ వెర్స్'నంటి, వచనానికి బాగా దగ్గరైన రచన లేదు. కనుక 'ఇంతకంటె లేదు' అనుకున్న గీతపద్యంగూడా సంభాషణకు చెరుకుగా ఉంది, సంగీతం ఎక్కువై అసహజంగా కనబడుతుంది.

శ్రీ విశ్వేశ్వరరావుగారు దీన్ని వచనంలోనే చక్కగా తెలిగిస్తే ఇంతకన్న ఆస్వాద్యం అగునేమో ఆలోచించదగ్గ విషయం.

ఈయన తెలుగులో చెయ్యితిరిగిన రచయిత కావడంవల్ల ఈయన అనువాదం విశిష్టం అవడాని కభ్యంతరం ఏమాత్రం లేదు. కాని ఈయన, మన పూర్వాంధ్రకవులు సంస్కృతానువాదాలలో అవలంబించిన స్వాతంత్ర్యం తీసుకుని ఠాకూరు భావాలను తేటతెలుగులో ప్రదర్శించిచూపితే కవిహృదయాన్ని ఇంకా ఎక్కువమంది సమీపించగల్గి ఉంటారు పాఠకులు—

ఈ అనువాదంలో యథాతథంగా ఉన్న బెంగాల్ సంస్కృతం, అతిశయోక్తి తగ్గించితే గ్రంథానికి ఇంకా శోభ కలిగించేదను. అయితే మొత్తంమీద-చదివి ఆస్వాదించదగిన నాటిక.

'ఆనందవర్ధన'

# గ్రంథ స్వీకారము

---

### భారత దేశము : ఆర్థిక వ్యవహారాలు

రచన: శ్రీ కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు గారు. ప్రచురణ: కళాపీఠం, బెజవాడ. వెల: రూపాయిన్నర.

### శ్రీ ధన్వంతరి చరిత్రము

పద్యకావ్యము. రచన: శ్రీ కోటి సూర్యనారాయణ శాస్త్రి గారు, వింజరం, యానాంపోస్టు, తూ. గో. జిల్లా. వెల: రూపాయిన్నర.

### భారత స్త్రీ

మూడంకాల రూపకము. రచన: గుగ్గిరాల వెంకటకృష్ణమూర్తిగారు. ప్రచురణ: స్టాండర్డు ఏజన్సీస్. మద్రాసు. వెల: రూపాయి.

### మహాదేవి అక్కగారి వచనములు

అనువాదకు: జి. టి. అక్కలయ్య దీక్షితులు గారు. ప్రచురణ: వీరశైవ సాహిత్య భాండారము, కేరాఫ్, చిక్కపేట, బెంగళూరు. వెల: ౧౨ అ.

### కాంగ్రెసు వైద్యదళము : మలయా యాత్ర

రచన: చింతలపాటి శివరామశాస్త్రి గారు. ప్రచురణ: శ్రీ హరనాథమురళి, తెనాలి. వెల: రూపాయిన్నర.

### బ్రహ్మచర్యము

అనువాదము: శ్రీ శుద్ధచైతన్యస్వామి. ప్రచురణ: జనోపకారిణీ స్టోర్సు, ప్రొద్దుటూరు.

### స్వరాజ్య సాధనము

రచన: [illegible] అచ్యుత రామారావుగారు. ప్రచురణ: సరస్వతీ గ్రంథమండలి, కాకరపర్రు. వెల: రూపాయి.

### కలరా

రచయిత: వేమవరపు వెంకటరమణ శర్మగారు, కపిలేశ్వరపురము, తూ. గో. జిల్లా. వెల: ౮ అ.

### ౧. గ్రంథాలయములు : రిజిస్ట్రేషను
### ౨. సభలు సమావేశములు

మొదటిది పొత్తూరి నాగభూషణం గారి రచన. రెండవది గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారిది. రెంటికిని ప్రకాశకులు: దేశికవితామండలి, బెజవాడ. వెలలు: ౬ అ.; రూపాయి పావలా.

### రేడియో

రచన: యల్. క. విశ్వనాథం గారు, గుంటూరు. వెల: ౮ అ.

### మంగళ ప్రభాతము

గాంధీగారి రచనకు వాకే సముద్రము నరసింగ రావు గారి (అనంతపురము) అనువాదము. వెల: ౧౦ అ.

### ౧. పద్మావతీచరణచారణచక్రవర్తి

(పద్యనాటిక. ద్వితీయముద్రణము. ౧౨ అ.)

### ౨. రత్నాకరము

(గీతికాసంవాదము. ౧౨ అ.)

### 3. దీక్షిత దుహిత

(పద్యనాటిక. రూపాయి పావలా.)

### ౪. కవిప్రియ

(కల్హణకథ. పద్యనాటిక. రూపాయిన్నర)

ఈ నాలుగున్ను సాహితీ సమితివారి ప్రచురణలు. శ్రీ శివశంకరశాస్త్రి గారి రచనలు.

### భారతాభ్యుదయము

శ్రీ విద్యారణ్య చరిత్రము. యక్షగానము. రచయిత: భీమవరపు సాంబశివశర్మగారు. ప్రకాశకులు: శ్రీరామా బుక్ డిపో, సికిందరాబాదు. ౮ అ.

### కర్ణసుందరి

బిల్హణ నాటిక కాంధ్రానువాదము. అనువాదకులు: శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, మాడిరాజు విశ్వనాథ రావుగార్లు. ప్రాప్తిస్థానము: విజయా బుక్ డిపో, వనపర్తి (నైజాము). ౧ రూ.

### నలప్రవాసము

తొమ్మిది దృశ్యముల నాటకము. గ్రంథకర్త: మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగ శాస్త్రిగారు. ప్రకాశకులు: సుందరరాం అండ్ సన్సు, తెనాలి. రూపాయిన్నర.

### విద్యార్థిని

సాంఘిక నాటకం. గ్రంథకర్త: పసుమర్తి రాఘవరావుగారు. తారా పబ్లికేషన్సు, మద్రాసు ౮. ౧౨ అ.

### ప్రజారాజ్యం

౧౮ రంగాల ఏకాంక నాటకం. రచయితలు: శాస్త్రి వెంకటవరదయ్య, ధూళిపాళ వెంకటసుబ్రహ్మణ్యము గార్లు, చిలకలూరిపేట, గుంటూరుజిల్లా. ౧౦ అ.

### సామ్రాజ్యము

లూయీఫిషర్ ఆంగ్లరచనకు అనువాదం. అనువాదకులు: పండితారాధ్యుల నాగేశ్వరరావు గారు. పెరంబూరు (మద్రాసు) సంస్కృతి గ్రంథ మండలి ప్రచురణ. ౧ రూ.

### నేటి సమస్యలు

గాంధీ మహాత్ముని రచనకు తత్త్వానందస్వామి అనువాదము. శ్రీ దుర్గా మార్కెట్ బుక్ డిపో, బెజవాడ. రూపాయిన్నర.

### సప్త మహావ్రతములు

గాంధీ మహాత్ముని రచనకు బులుసు సూర్య ప్రకాశశాస్త్రిగారి అనువాదము. సుందరరాం అండ్ సన్సు, తెనాలి. ౬ అ.

### ఆరోగ్య ప్రభాకరము

శ్రీ రాఘవేంద్రస్వామి (శ్రీ యోగాశ్రమం, వసూరేపల్లె) రచన, తెనాలి సుందరరాం అండ్ సన్సు ప్రచురణ. ౯ పైసల తపాలాబిళ్ళలు పంపిన మాత్రాన ఆశ్రమములకు, గ్రంథాలయాలకు, భజన మందిరాలకు, ఇత్యాది సంస్థలకు ఉచితం.

### జాతీయ దసరా గీతములు

శాస్త్రి వెంకటవరదయ్య, ధూళిపాళ వెంకటసుబ్రహ్మణ్యము గార్ల రచన. తెనాలి విశ్వజ్ఞ మండలి ప్రచురణ. ౨ అ.

### ప్రత్యేక సంచికలు

బరంపురం నుంచి 'వెలుగు' ఉగాది కిరణాన్ని, మద్రాసునుంచి 'ఢంకా' సంవత్సరాది సంచిక, 'సూర్యప్రభ' సంచికలను కూడా సాదరంగా స్వీకరించినాము. ప్రత్యేక వ్యాసాలతోనూ, చిత్రాలతోనూ ఇవి వాటి వాటి ఆదర్శానుగుణంగా చక్కగా తయారై ముచ్చటగా ఉన్నాయి.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No, 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.